# పశురోగాలు-నివారణ



రచన :

డా. సూర్యదేవర రవికుమార్

బి.వి.యస్సి

శ్రీ వెంకటేశ్వర పబ్లిషింగ్ హౌస్

ఏలూరురోడ్ : విజయవాడ-520 002

# పశురోగాలు – నివారణ

ప్రతి ప్రాణికి జీవితంలో నొప్పి, రోగము తప్పని విషయాలు. మనిషికాని, జంతువుగాని, ఈ రెండిటితో జీవిత కాలంలో కొన్నాళ్ళయినా బాధపడక తప్పదు మనిషి అయితే తన నొప్పిని, రోగాన్ని గుర్తించి తగిన చికిత్స కోసం అన్వేషిస్తాడు. మరి మూగజీవాలో! యజమాని గుర్తించి చికిత్స చేయించేదాకా అవి మౌనంగా బాధను భరిస్తూనే ఉంటాయి.

తన ఆరోగ్యము ఎంత ముఖ్యమో తను పెంచి పోషించే ప్రేమించే పశువుల ఆరోగ్యం కూడా యజమానికి అంతే ముఖ్యం. దొడ్డిలోగల పశువు అనారోగ్యంతో మేత ముట్టకపోతే విలవిలలాడుతూ ముద్దయినా ముట్టని భూత దయార్ద్ర బుద్ధులైన పశుపోషకులు ఎందరో కన్పిస్తారు. పశుజాతి అనారోగ్యం వ్యక్తి ఆర్థిక పురోగతికి దేశసౌభాగ్యానికి గొడ్డలిపెట్టు. ఆరోగ్యంగా జీవించే పశుజాతే అధికోత్పత్తికి మొదటి సూత్రం గదా!

రోగవ్యాప్తి బహువిచిత్రమైనది. కొన్ని రోగాలు

కొన్ని కొన్ని జాతుల పశువులకే పరిమితమైనాయి. అవి ఇతరజాతి పశువులకు రావు. భయంకర వ్యాధులను కలిగించే క్రిములు, సూక్ష్మజీవులు కొన్ని జాతుల జంతువుల శరీరాలలోఉన్నప్పటికిఅవి వాటినిబాధించవు చంపవు.ఆజంతువులు ద్వారా ఇతర జంతువులు ఆ వ్యాధులకు గురై మరణిస్తాయి. పక్షులు దూరప్రాంతాలకు వెళుతూ తమ రెట్టలద్వారా రోగాలను కూడా ఆ క్రొత్త ప్రాంతాలకు వ్యాపింపజేస్తాయి. ఈనాడు ప్రపంచ వ్యాప్తంగా పశువుల రాకపోకలు జరుగుతుండటంతో ఎన్నో రోగాలు దేశదేశాలకు వ్యాపిస్తున్నాయి. 1943 వరకు ఆఫ్రికానుదాటిరాని బ్లూటంగ్ (నీలినాలుక) అనే వ్యాధి ఈనాడు 15 దేశాలకు పాకింది. ఇదిలా ఉంటే శాస్త్రవిజ్ఞానం ఎన్నో రోగాలకు టీకామందులను కనిపెడుతూ వాటివ్యాప్తిని అరికడుతున్నాయి. కొన్ని దేశాలు కొన్నికొన్ని రోగాలను నిర్మూలించుకోగలిగాయి కూడా.

సహజంగానే ప్రాణికోటికి కొంత రోగ నిరోధకశక్తి ఉన్నది. పశువులలో ఇది జాతిస్వభావము, వంశలక్షణాలు, వయోభేదం, లింగభేదం, వాతావరణం, ఆహారం, పోషణ పాలనరీతులు మొదలగువాటిని బట్టి ఉంటుంది. రోగనిరోధక శక్తి శరీరంలో తగ్గినప్పుడు పశువు కొన్ని వ్యాధులకు గురికావటం జరుగుతుంది. వ్యాధికి తగిన చికిత్స చేయకుంటే ప్రాణాపాయమేగదా!

ప్రపంచంలోని ప్రతి మానవుడికి తెలిసిన విద్య

వైద్యమే అని కృష్ణరాయల వారికి నిరూపించి చూపాడట తెనాలి రామలింగడు. రోగిని పరామర్శించడానికి హాస్పిటల్‌కు వెళ్ళికూడా రోగి తన బాధను చెప్పగానే "ఫలానా వైద్యం చేసి చూచారా" అంటూ తమ వైద్య విజ్ఞానాన్ని వెల్లడించేవారు ఎందరో కన్పిస్తారు. వైద్యం చేయటం సులువే. కాని రోగ నిర్ణయమే కష్టమైన విద్య. వైద్యాన్ని ప్రారంభించేముందు రోగానికి మూలకారణాన్ని తెలుసుకోవటం అవసరం. మూగజీవాల విషయంలో ఇది అంత సులభంకాదు. తగినంత అనుభవము, విజ్ఞానము, ఓర్పు ఉన్నప్పుడే ఇది సాధ్యమౌతుంది.

పశుచికిత్సా విధానాలు, ఎన్నోరకాలు. ఆయుర్వేదం (ముఖ్యంగా మూలికా చికిత్స),అగ్ని చికిత్స (వాతలు వేయటం), అల్లోపతి, హోమియోపతి, అయస్కాంతచికిత్స మొ॥ వైద్యవిధానం ఏదైనా, అనుభవంగల చికిత్సకుడు చేసే చికిత్స తప్పక సత్ఫలితాన్ని ఇస్తుంది. శ్రద్ధ, ఆసక్తి ఉంటేనేగదా అనుభవం వచ్చేది.

మనదొడ్లోను ఇరుగు పొరుగు వారి దొడ్లలోనూ ఉన్న పశువులలో ఏదైనా అనారోగ్యానికి గురిఅయితే అందుబాటులో పశువైద్యశాల ఉంటే సరి లేకుంటే దాని బాధను నివారించడానికి యజమానిగాని, వైద్యం తెలిసిన వారుగాని ప్రయత్నం చేయాలి. అనారోగ్యంతో ఉన్న పశువును

చక్కగా పరీక్షచేసి దాని రోగలక్షణాలను గమనించి ప్రాథమిక చికిత్సచేస్తే కొంతయినా ఫలితం కనబడుతోంది.

ఇప్పుడు పశువులలో సాధారణంగా కన్పించే కొన్ని రోగాలు, నొప్పులను గూర్చి, వాటికి అనుభవం గల పశువైద్యుడు అందుబాటులో లేనపుడు చేయదగిన చికిత్సను గూర్చి తెలుసుకుందాం.

## అజీర్తి

పశువులలో అజీర్తి అరలపొట్ట కదలికలు మందగించటం వలన ఏర్పడుతుంది. అనేక రోగాలకు యిది ఒక లక్షణము. ఇతరములైన రోగాలు లేక పశువు మామూలుగా ఉండి అజీర్తితో బాధపడటానికి కారణం మేతలో లోపమే. పశువు మందముగాఆకలి లేకుండా,తగ్గినలేదామానిననెమరుతో కన్పిస్తుంది. జీర్ణాశయంలో జీర్ణ క్రియమందగిస్తుంది. పిండి పదార్థాలు ఎక్కువగా ఉండే ఆహారాన్ని (అన్నం, జొన్నన్నం, నూకలకూడు, బెల్లపుపాకం, అరటికాయలు మొ||) పరిమితికి మించి పెట్టినప్పుడు ఆమ్ల మూలకమైన అజీర్తి ఏర్పడుతుంది. ఇటువంటి పశువు నోటివెంట చొంగకారుస్తూ, పళ్ళునూరుతూ, పారుతూ, కడుపు నొప్పితో పడుతూ లేస్తూ ఉంటుంది. ఇక, అతిగా కుళ్ళిన దాణావలన, మాంసకృత్తులు

అధికంగా కల ఆహారాన్ని ఎక్కువగా ఇవ్వటం వలన, మురుగునీటివలన క్షార పరిమితి పెరిగి క్షారమూలకమైన అజీర్తి కలుగుతుంది. నోటివెంట చొంగపడటంపేడ అనుకుగా లేదా పిట్టంకట్టివేయటం కండరాలు అదరటం, నోటినుండి దుర్వాసన, కళ్ళనుండి ముక్కులనుండి నీరు కారటం, పలు మార్లు మూత్రం పోయటం, ఎక్కువైన దాహం దీని లక్షణాలు.

సాధారణమైన అజీర్తి సులభంగా జీర్ణమయ్యే లేతమేత కొద్దికొద్దిగా పెట్టాలి. మినరల్ మిక్చర్ ఉపయో గించి జీర్ణక్రియను పెంచాలి. మందుల షాపులలో దొరికే పశుటోన్, హిమాలయన్ బతిసా మందులలో ఒకదానిని 50 గ్రాములుగాని. ఎనరెక్సాన్, రుమెన్టోన్, బోవిరమ్ బిళ్ళలలో ఒక రకం బిళ్ళలు రెండేసిగాని బెల్లంలో కలిపి 2, 3 రోజులు పెట్టాలి. ఈ మందులు లభించనపుడు 15 గ్రాముల శొంఠిపొడి 15 గ్రా నవాసారం జావలో కలిపి ఇవ్వవచ్చు.

ఆమ్లమూలకమైన అజీర్తితో బాధపడే పశువుకు పిండి పదార్థాలను తగ్గించి పెట్టి తగినంత వ్యాయామం చేయించాలి. సున్నపుతేటను పెట్టవచ్చు. 30 గ్రాములసోడా ఉప్పునైనా పెట్టవచ్చు. ఆరోగ్యంగా వున్న పశువు నెమరు తీసి పెట్టటం మంచిది. మందుల షాపులలో లభించే ఫ్లోర

టోన్ బిళ్ళలను పూటకు 4 చొప్పున 3 పూటలు పెట్టినా గుణం కన్పిస్తుంది.

క్షారమూలకమైన అజీర్తితో బాధపడే పశువుకు (తులం నవాసారాన్ని నీళ్ళలో కలిపి త్రాగించవచ్చు. ఎలక్ట్రాల్ పొడిని నీళ్ళలోగాని, గ్లూకోస్‌నుగాని నీళ్ళలో కలిపి త్రాగించటం మంచిది.

## కడుపు ఊరిత (పొట్ట ఉబ్బటం)

ఆహార నాళంలో అడ్డంకు లేర్పడినప్పుడు లేదా ఆహారనాళం మీద వత్తిడి ఏర్పడినపుడు కడుపు ఊత కలుగుతుంది. కాయధాన్యాలును పప్పుజాతికి చెందిన లేతగా ఉన్న పశుగ్రాసాలను అధికంగా మేపటం వలన కడుపులో ఆహారపదార్థాలు పులిసి వాయువులు పుట్టి కొన్ని సార్లు నురగతో కలిసి పశువులకు కడుపు ఊతను కలిగిస్తాయి. పశువు పొట్ట బిర్రుగా ఉబ్బి నాలుక బయటకు వస్తుంది. నోటి వెంట చొంగ పడుతుంది. మాటి మాటికి పడుకొని లేస్తూ ఎంతో అసౌకర్యంగా ఉంటుంది పశువుకు. దీనికి సత్వర చికిత్స చేయకపోతే ఊపిరి తిరుగక మరణిస్తుంది.

ఆహారనాళంలోని అడ్డంకులను గుర్తించినట్లయితే దానిని తొలగించే ఉపాయం ఆలోచించాలి. ఆహారనాళాన్ని పైకి క్రిందకు సవరించటం కొంత ఉపయోగించవచ్చు.

మెత్తగా వంగే సన్నని పేము బెత్తాన్ని ఆహారనాళంలోకి పోనిచ్చి అడ్డంకిని తొలగించవచ్చు.

ఆహార కారణాల వలన ఏర్పడిన కడుపు ఉబ్బుకు పశువుకు 200నుండి 250 గ్రాముల కొబ్బరినూనెనుగాని నువ్వుల నూనెనుగాని జాగ్రత్తగా పొరపోకుండా త్రాగించాలి దీనిలో 15 మిల్లీలీటర్ల టర్పంటయిన్ ఆయిల్‌ను కలపటం మంచిది. మందులషాపులలో లభించే "బ్లోటోసిల్" మందు ద్రవాన్ని 100 మిల్లీలీటర్లను గాని, "టింపాల్" అనే పొడి మందును (70 గ్రాములు) కొద్దిగా బెల్లంవేసి నూరిగాని లోనికి పెట్టాలి. ఉబ్బు అధికంగా ఉండి ఊపిరి తిరగక పశువు మరణిస్తుందేమోనని అనిపించినప్పుడు పశువు ఎడమ వైపున నడుము పక్క ఎముకలనుండి, చివరి పక్కటెముక నుండి, తుంటి ఎముక కొసనుండి సమానమైన దూరములో పదునైన పేనాకత్తితో కడుపులో పొడిచి ఆ రంధ్రంలో బోలుగా ఉన్న వెదురుబొంగు ముక్కను పెట్టి అది కడుపు లోకి జారకుండా కదలకుండా గట్టిగా కడితే దాని ద్వారా కడుపులోని గాలి బయటకు వచ్చి పశువు ప్రాణాపాయం నుండి బయటపడుతుంది. జొన్నదంట్లు కాల్చి మసిచేసి

నీళ్ళలో కలిపి త్రాగించితే కడుపు ఉబ్బు వెంటనే తగ్గుతుందని ప్రాచీన గ్రంథంలో చెప్పబడింది.

లేత పశుగ్రాసాలను పశువులకు పెట్టేటప్పుడు ఎండు గడ్డిని కూడా తగినంతగా మేపటం ద్వారా, కాయధాన్యాలను నలగగొట్టి గాని దంచిగాని పెట్టటం ద్వారా దీనిని రాకుండా చూచుకొనవచ్చు.

## పారుడు

పశువులలో పారుడు ఒక రోగంగానే కాక, అనేక రోగాలకు ప్రధానలక్షణంగా కనిపిస్తుంది. ఆహార విషయంగా కలిగే పారుడు సాధారణమైనది. జీర్ణకోశంలోను, ప్రేగుల లోను పురుగులు (పరాన్నజీవులు) చేరటం వలన పారుడు కలగవచ్చు. ముసరవ్యాధివలన మరికొన్ని వైరస్‌ల వలన కలిగే పారుడు ప్రమాదకరమైనది. ప్రేగులలో క్షయవ్యాధి సోకినపుడు కూడా ఇది కన్పిస్తుంది. చిన్న చిన్న దూడలలో పాలు అరగక కూడా పారుడు ఏర్పడుతుంది. ఏలికపాములు కూడా పారుడును కలిగిస్తాయి.

ప్రేగులలో నీటిని పీల్చే శక్తి తగ్గినపుడు ఆహారపు అరుగుదల సరిగాలేనపుడు, ఉద్వేగానికి గురయినపుడు సాధారణమైన పారుడు ఏర్పడుతుంది. మేతలో దోషం వుంటే మేతనుమార్చి సులభంగా జీర్ణమయ్యే మేతను వేయాలి. పుష్కలంగా గంజి, నీరు ఇవ్వాలి. పొడి చేసిన నీమసున్నం 30 గ్రాములు కాచుపొడి 15 గ్రాములు, వాముపొడి 15 గ్రా గంజిలో కలిపి రోజుకు రెండుసార్లు ఇవ్వటం మంచిది. పరాన్న జీవుల వలన కలిగే పారుడుకు పశువుపేడను పశువైద్యశాలలో పరీక్షచేయించుకొని తగిన మందు వాడాలి. పాలు అరగక పారేదూడలకు విరేచనాలకు ఆముదం లేదా సాల్టును త్రాగించి ఆ తర్వాత నీళ్ళుకలిపిన పాలను ఇవ్వాలి. ఏలికపాముల నివారణకు గాడిద గడప ఆకు, ఉప్పు కలిపి నూరిఉసిరికాయంత వుండచేసి పెట్టవచ్చు. లేదా మందులషాపులలో దొరికే పేనాకూర్ 150 మిల్లిగ్రాముల బిళ్ళను ఒకటి వేయవచ్చు.

మునర వ్యాధి వలన కలిగే పారుడు ప్రమాదకరమైనది. దీనికి మృదువైన ఆహారంతోపాటు ఉప్పువేసిన గంజిని ఎక్కువగా త్రాగించాలి. మునరనే కొందరు, దొమ్మ

అని కూడా అంటారు. "దొమ్మ రోగానికి కొర్రగంజి" అనేది పల్లెప్రజల సామెత. సీమసున్నం, కాచుపొడి చికిత్సతోపాటు స్టెక్లిన్, ఆల్‌సైక్లిన్, టెర్రామైసిన్, సల్ఫా డిమిటిన్, బయోట్రిమ్, సల్ఫాట్రిమ్‌వంటి బిళ్ళలను ఏవైనా ఒకదానిని పూటకు 4 చొప్పున వాడుతుండాలి.

# జ్వరము

శరీరంలోని అనేక క్రియల వలన ఉష్ణం ఉత్పత్తి అవుతుంది. కసరత్తు, వ్యాయామం చేసినప్పుడు ఉష్ణం ఉత్పత్తి 300 శాతం పెరుగుతుంది. అయినప్పటికి శరీర ఉష్ణోగ్రత స్థిరంగానే ఉంటుంది.

పశువుల సాధారణ శరీర ఉష్ణోగ్రత 101.5 ఫారెన్ హీట్ లేదా 38.5 సెంటిగ్రేడ్ డిగ్రీలు, శరీర ఉష్ణోగ్రత ఈ స్థాయిని మించి ఉంటే స్థితినే మనం జ్వరము అని అంటాం. జ్వరస్థితిలో ఉష్ణం ఉత్పత్తి 20 నుండి 30 శాతం

మాత్రమే పెరుగుతుంది. సాధారణ శరీర ఉష్ణోగ్రత ఒక డిగ్రీ సెంటిగ్రేడు లేదా రెండు డిగ్రీల ఫారన్‌హీటువరకు ఉదయం పూట తగ్గటం, సాయంత్రం పూట పెరగటం మామూలే. దీనిని జ్వరంగా గుర్తించటం పొరపాటు.

పశువుకు జ్వరం తగిలినప్పుడు జీర్ణక్రియ అస్తవ్యస్తమౌతుంది. నీటిని, ఆహారాన్ని ఇష్టంగా తీసుకోదు. నాడీచలనం పెరుగుతుంది. మలబద్ధకం, నిస్సత్తువ, కొద్దిగా మూత్రం పోయటం, నోరు ఎండుకుపోవటం పాల ఉత్పత్తి తగ్గటం ఇతర లక్షణాలు.

శరీరానికి ఉష్ణాన్ని నియంత్రణ చేసేశక్తి తగ్గిపోవటం వలన జ్వరం వస్తుంది. బాక్టీరియా, వైరస్, ఫంగస్, పరాన్నజీవులు కలిగించే వ్యాధులలోను, అధికమైన శారీరక గాయాలు ఏర్పడినప్పుడు, కొన్ని శస్త్ర చికిత్సల తరువాత జ్వరం కన్పిస్తుంది.

జ్వరానికి ఈనాడు యాంటిబయాటిక్ మందులను విచక్షణారహితంగా వాడుతున్నారు. జ్వరం వచ్చినపుడు దానికి గల కారణాన్ని తెలుసుకొని వైద్యం చేయటం

మంచిది. గాయాలు, శస్త్ర చికిత్సలవలన కలిగే జ్వరానికి ముందుగా ఆ గాయాలలోని కుళ్ళిన భాగాలను తీసివేసి శుభ్ర పరచాలి. జ్వరంతోపాటు కన్పించే ఇతర లక్షణాలను గమనించి ఏ ఏ సూక్ష్మజీవులు దానికి కారణమో తెలుసుకొని చికిత్స చేయించాలి. యాంటిబయాటిక్ మందులను విచక్షణా రహితంగా వాడకూడదు. సల్ఫాడిమిడిన్, సల్ఫాట్రిమ్, టెర్రామైసిన్‌వంటి బిళ్ళలను పూటకు 4 చొప్పున వాడటం కొంత గుణాన్నిస్తుంది. ఆయుర్వేదంపట్ల ఆసక్తి కలవారు పూటకు 2 తులాల నేలవేము పొడిని, గచ్చకాయ బెరడు పొడి, నల్లకాచుపొడి, సూరేకారం ఇవి ఒకొక్క తులం చొప్పున సంపాదించి మొత్తం కలిపి బెల్లంతో పెట్టవచ్చు. జ్వరం తగ్గినాక తిప్పతీగ రసం ఒక ఔన్సు, నేలవేము రసం ఒక ఔన్సు, శొంఠిపొడి 1 తులం వేడినీళ్ళలో కలిపి రెండుపూటలు పెట్టవచ్చు.

# పాలజ్వరము

పాడి పశువు ఈనిన తరువాత కొద్దిగంటల్లు (తరచుగా 48 గంటలు) లేదా రోజులు (సాధారణంగా 3, 4 వారాలు) కు కన్పించే యీ జబ్బును రైతులు బాలెంత జబ్బు అని అంటుంటారు. తొలిచూలు పశువులలో ఇది అంతగా కన్పించదు. ఈతల పశువులలో కూడా ఎక్కువగా పాలిచ్చే వాటిలో తరచుగా ఇది కన్పిస్తుంది. విదేశీ జాతి ఆవులలో జెర్సీజాతి ఆవులు ఈ రోగానికి ఎక్కువగా గురి అవుతాయి.

పశువు ఈనగానే పాల ఉత్పత్తి ప్రారంభమవుతుంది. ఆ సమయంలో రక్తంలోని కాల్షియం పాలలోనికి దిగుమతి అవుతుంది. తను కోల్పోయిన కాల్షియాన్ని రక్తం, ఎముకల నుండి రక్తంలోకి కాల్షియం రావటానికి- పారాథైరాయిడ్ అనే గ్రంధి సక్రమంగా పనిచేయటం అవసరం.

పశువు చూలుతో ఉన్నప్పుడు కాల్షియం, భాస్వరం తగినంతగాగల ఆహారాన్ని ఇవ్వకపోవటం వలన ఈనిన పశువులో పై గ్రంథి సక్రమంగా పని చేయలేదు. ఫలితంగా ఎముకలలోని కాల్షియం రక్తంలోనికి రాక, రక్తంలో కాల్షియం లోపించి ఈ పాలజ్వరం అనే జబ్బు వస్తుంది. 48 గంటలసేపు పశువుకు ఆహారాన్ని ఇవ్వకపోవటం వలన కూడా ఈ స్థితి కలుగుతుంది.

తల, కాళ్ళు వణకటం, పశువు మామూలుగా కదలలేకపోవటం, ఆహారం మీద ఆసక్తి లేకపోవటం, నాలుక బయటికి చాచటం, పళ్ళు నూరటం ఈ వ్యాధి తొలిదశలోని లక్షణాలు. మలిదశలో పశువు నిస్సత్తువతో నేలమీద ముట్టె ముడుచుకొని పడుకొని ఉంటుంది.శరీరం చల్లబడుతుంది.శరీర ఉష్ణోగ్రత 97 ఫారన్‌హీట్ డిగ్రీలకు పడిపోతుంది. సకాలంలో వైద్యం జరగకపోతే పశువు మరణిస్తుంది. కనుక దీని విషయమై పశుకామందులు అశ్రద్ధ చేయకూడదు.

రక్తంలోకి కాల్షియం బోరోగ్లూకొనేట్ ద్రవాన్ని ఎక్కించటమే దీనికి నమ్మకమైన చికిత్స. దీనికి అవకాశం లేనప్పుడు కాల్షియం బోరోగ్లూకొనేట్ పొడిని నీళ్ళలో కలిపి

త్రాగించటం కాని కాల్‌జాల్ అనే కాల్షియం టానిక్‌ను ఒక అరలీటరు మందును తాగించటం కాని చేస్తే కొంత ఫలితం కనిపిస్తుంది.

పశువు ఈ స్థితినుండి కోలుకొన్న తరువాత రెండు రోజులవరకు పాలను పొదుగునుండి పూర్తిగా పిండకుండా దూడకు చాలిన పాలను మాత్రమే పిండటం మంచిది. పశువు లేవలేక పడుకొని ఉంటే ఒకవైపున పడుకోనీయకుండా రోజుకు 3,4సార్లు ఇటునుండి అటు పొర్లించాలి. వంటిని, కాళ్ళను గడ్డితో బాగా రుద్దాలి.

పశువులకు పాలజ్వరం రాకుండా పూర్తిగా నిరోధించలేముగాని దీని విషయమై కొన్ని జాగ్రత్తలు తీసుకోవచ్చు. పశువు చూలుతో ఉన్నప్పుడు కాల్షియం,భాస్వరం తగినంతగా గల (ఇవి రెండు క్రమంగ 1:3 నిష్పత్తిలో ఉంటే మంచిది) సమీకృతాహారాన్ని వాడటం, ఈనిన తర్వాతకూడా వీటిని అందించటం, పశువుకు ఆకలి కలిగించే మందులు వాడటం, ఆమ్లగుణం కలిగిన ఆహారాన్ని మేపటము, మేతలేకుండా పస్తులు అట్టిపెట్టకుండా ఉంచటం ఈ జబ్బురాకుండా కొంతవరకు తోడ్పడతాయి.

## కురవం

వైరస్ వలన కలిగే మూడురోజుల జ్వరాన్ని కురమ అంటారు. మొదటి రోజున 105, 106 డిగ్రీల (ఫారన్ హీట్) జ్వరము తగులుతుంది. రెండవరోజుకు కాళ్ళు, తల, మెడ వీపు భాగాలలోగల కండరాలలో నొప్పి ఏర్పడుతుంది. దీనితో పశువు మునగదీసుకుని ఉంటుంది. సక్రమంగా నడవలేక కుంటుతుంది. మేతమేయదు. మూల్గుతుంది. పాడి పశువులు పాలీయవు. కొన్నిటిలో మలబద్ధకం మరి కొన్నిటిలో పారుడు కనిపిస్తాయి. మాటిమాటికి తలాడించ టం, కళ్ళు, ముక్కుల వెంబడి నీరు కార్చటం ఈ వ్యాధి లక్షణాలే. మూడవరోజుకు జ్వరం తగ్గి పశువు నెమరుకు తిరిగి మేతమేస్తుంది. కాని నీరసం మాత్రం మరొక రెండు మూడు రోజులవరకు తగ్గదు.

దీనికి ప్రత్యేకమైన చికిత్స ఏమీలేదు. వైద్యం చేసినా, చేయకపోయినా మూడవరోజుకు కురమ తగ్గుతుంది.

ఈ రోగం తగిలిన పశువుకు గొట్టంతో ద్రవ పదార్థాలను పెట్టకూడదన్న విషయాన్ని పశుపోషకులు గుర్తించు కోవాలి.

గ్రామాలలో కురమ తగిలిన పశువుకు దుష్టపు తీగను మెడలో వేయటం కన్పిస్తుంది. కొందరు చేదుబీర తీగకుగాని దూసరితీగకుగాని చెప్పను కట్టి పశువు మెడలో వేస్తారు. మరికొందరు పిడకల బూడిదను శరీరానికి పూస్తారు.

## పొదుగు వాపు

పాడి పశువులలో అనర్థదాయకమైన రోగము పొదుగు వాపు. కారణాలు ఏమైనా, పాలను ఉత్పత్తిచేసే పొదుగు వాపు, నొప్పి, వెచ్చదనాలతో రోగగ్రస్తమైన రంగుమారిన లేదా కుదపలతో కూడిన లేదా నీళ్ళవంటి పాలను ఉత్పత్తి చేసినప్పుడు ఆ పశువుకు పొదుగు వాపు వ్యాధి ఏర్పడినదని అనుకోవాలి.

భారతదేశంలోని గేదెజాతి పాడి పశువులలో ఈ వ్యాధి సుమారు 25 రకాల సూక్ష్మజీవుల ద్వారా రావచ్చు నని పరిశోధకుల నిర్ణయం. ఈ సూక్ష్మజీవులు చంటీ రంధ్రముల ద్వారానే పొదుగులోనికి ప్రవేశించి రోగాన్ని కలిగిస్తాయి. ఇది గట్టిగా గుర్తుంచుకోదగినఅంశం. చన్నుల మీద, పొదుగుమీద ఏర్పడిన పుండ్లు, దూడనోటిలో ఉన్న పుళ్ళు, అపరి శుభ్రమైన పాలపాత్రలు, పితికే చేతులు ఇవి యీ రోగాన్ని కలిగించేందుకు సహాయపడతాయి. సూక్ష్మ జీవుల రోగకారక శక్తితీవ్రతను బట్టి, పొదుగుయొక్క రోగనిరోధక శక్తిసాయిని బట్టి రోగం క్రమంగా గాని వేగంగాగాని అభివృద్ధి చెందుతుంది.

పొదుగు వాపును స్పష్టంగా తెలుసుకోవటం పాలను సూక్ష్మంగా పరిశీలించటం వలన మాత్రమే తెలుస్తుంది. ఇది పశుకామందులకు సాధ్యపడదు కనుక వారు పొదుగువాపు ప్రారంభదశను స్పష్టంగా గుర్తించటం కష్టం. పాలధారల రాకలోను, పాలలోను వారు ఏదైనా తేడాను గుర్తిస్తే వెంటనే ఆ పశువును పశువైద్యశాలలో పరీక్ష చేయించు

కోవాలి. పొదుగువాపుకు పశుకామందులు స్వయంగా చేసు కొనే నమ్మకమైన చికిత్సకూడా ఏమీలేదు. (అల్ మాస్ట్ అనే హోమియోబిళ్ళలు రోజుకి 5 నుండి 10వరకు ఇవ్వటం వలన కొంతగుణం కనిపించవచ్చు) కాని, పొదుగు వాపుకు పాడి పశువు గురికాకుండా చూచుకోవటంలో పశుకామందుల పాత్ర ఎంతో ఉంది.

పశువు చన్నులకు,పొదుగుకు ఏదైనా పుండు ఏర్పడి నప్పుడు అశ్రద్ధచేయకుండా దానికి వెంటనే చికిత్స చేయిం చాలి. పుండు ఉన్న చంటిని దూడ చీకకుండా చూచుకొంటూ దానికి చల్లని నీళ్ళతో కడిగి గాయాలకు వ్రాసే ఆయింట్ మెంటును వ్రాస్తే అది త్వరగా మానుతుంది. దొడ్డిలో ఒకటి కంటె ఎక్కువ పాడి పశువులు ఉండి ఒకదానికి ఈ జబ్బు వస్తే దానిని మిగిలిన వాటికి దూరంగా ఉంచాలి. వ్యాధి వచ్చినపుడు అది ఏ విధంగా సంక్రమించిందో తెలుసు కొనేందుకు ప్రయత్నించాలి. పాలుపిండే చేతులను పాత్ర లను పరిశుభ్రంగా ఉంచుకోవాలి. పాలుపిండిన తరువాత చన్నులను "బెటాడిన్" వంటి యాంటి సెప్టిక్ ద్రవంలో

పొదుగు వరకూ పూర్తిగా ముంచటం వలన ఈ రోగ వ్యాప్తిని అరికట్టవచ్చు. పాలుపిండం మానివేసినపుడు-పాడి పశువు ఎండిపోయినప్పుడు- చన్నులను పొదుగును శుభ్రంగా కడిగి చన్నులను 5 శాతం టించర్ అయొడిన్ ద్రవంలో 10 రోజులు రోజుసుమారు అరనిముషం సేపు ముంచి ఉంచటంవలన పశువు మళ్ళీ ఈనబోయే ముందే ఈ వ్యాధికి గురయ్యే అవకాశం ఉండదు.

## రక్తమూత్రం

రక్తాన్ని ఆశ్రయించిన పరాన్నజీవుల వలన కలిగే వ్యాధిలో మూత్రం రక్తంతో కూడి ఉంటుంది. ఆకలి, నెమరు లేకపోవటం, జ్వరము, మలబద్ధకం కలగటం, కళ్ళు ఎర్రపడి పాలిపోయి పచ్చబడటం, మూత్రం ఎర్రగాగాని, కాఫీరంగుగాగాని రావటం- ఆ వ్యాధి లక్షణాలు. ఇది తరుణ

వ్యాధిగా వచ్చినపుడు వ్యాధిసోకిన 10, 12 రోజులలో పశువు చనిపోతుంది. చూడిపశువులు ఈసుకుపోతాయి.

ఈ రోగానికి పశుకామందులు స్వంతంగా చేసుకొనే నమ్మకమైన వైద్యం ఏమీలేదు. అతిమధురము యాలకులు, ద్రాక్షపండ్లు, బూరుగుబంక, తెల్ల నువ్వులు, పంచదార, ఖర్జూరపు పండ్లు సమంగా నూరి కల్లుతో పెట్టినా, 2 పలాలు (70 గ్రాములు) పంచదార, తవ్వెడు దోసవిత్తనాలు నూరి బియ్యం కడుగుతో పెట్టినా యీ వ్యాధి తగ్గుతుందనిఅంటారు. ఏమైనా పశువును పశువైద్యశాలకు తీసుకువెళ్ళి తగిన చికిత్స చేయించుకోవటం మంచిది.

పశువు ఈ వ్యాధికి గురైనప్పుడు ఆహారంలోఎక్కువగా పిండిపదార్థాలను, గ్లూకోస్‌ను ఇవ్వాలి. గోమార్లు కుట్టటం ద్వారా ఈ వ్యాధి వ్యాపిస్తుంది కనుక పశువులను వాటి బారిన పడనీయకూడదు.

## కుందేటి వెర్రి

రక్తంలో తిరుగుతూ అభివృద్ధి చెందే ఏకకణజీవి వలన కలిగే కుందేటి వెర్రి (సర్రా) వ్యాధి జోరీగల ద్వారా వ్యాప్తి చెందుతుంది. వ్యాధిసోకిన పశువును కుట్టిన జోరీగం, తరువాత ఆరోగ్యంగా ఉన్న పశువును కుట్టినప్పుడు ఈ వ్యాధి సంక్రమిస్తుంది. ఇది తరుణ వ్యాధిగాను, దీర్ఘవ్యాధి

గాను కన్పిస్తుంది. తరుణ వ్యాధి సోకిన పశువుకు జ్వరం వస్తుంది. వెర్రిచూపులు చూస్తుంది. కట్టుగొయ్య చుట్టుతిరగటం, వణకటం, విరుచుకు పడిపోవటం ఇతర లక్షణాలు. పాడి పశువులలో పాల ఉత్పత్తి వెంటనే పూర్తిగా తగ్గటం ఈ వ్యాధి మరొక లక్షణం. దీర్ఘవ్యాధితో బాధపడే పశువు క్రమంగా క్షీణిస్తుంది. శరీరంలోని క్రింద భాగాలకు- దవడ, పొట్ట కాళ్ళక్రింద భాగం మొదలగువాటికి- నీరు వస్తుంది. పాల ఉత్పత్తి తగ్గుతుంది. కళ్ళు తెల్లని పొరలు కమ్ముతాయి.

పసువులలో ఈ లక్షణాలు కన్పించినపుడు దాని రక్తాన్ని పరీక్ష చేయించి వ్యాధి నిర్ధారణ అయితే చికిత్స చేయించాలి. ఈ వ్యాధి నమ్మకంగా తగ్గించే మందులు మార్కెట్‌లో లభిస్తున్నాయి. (యాంట్రిసైడ్ ప్రొసాల్టు, సురామిన్, ట్రిక్విన్ మొదలైనవి.) చుట్టుపక్కల దొడ్లలోని పసువులలో ఈ వ్యాధి కన్పించినపుడు ఆరోగ్యంగా వున్న పసువుకు పై మందును వాడితే రెండు నెలల వరకు దానిని ఈ రోగం బారినుండి రక్షించుకోవచ్చు. జోరీగలు లేకుండా చూచుకోవడం వ్యాధి నివారణ మార్గంగా చెప్పవచ్చు.

# నీరుపట్టుట

శరీరంలో కణాలలోను,కణాలమధ్యన నీరు ఉంటుంది. ఈనీరు వివిధ రోగాలలో ఒకచోట-ముఖ్యంగా పశువుక్రింద భాగాలలో-చేరుతుంది. పశువు శరీరంలో రక్తాన్ని పీల్చే పరాన్నజీవులు, జలగలు (లివర్ ఫ్లూక్స్) చేరినపుడు, కాలేయం (లివర్) చెడిపోయినపుడు, మూత్రపిండాలకు సంబంధించిన రోగాలలోను, గుండె జబ్బుల మూలంగాను, ఉపవాసాల వలన, మాంసకృత్తులు విటమిన్ లేని ఆహారాన్ని తీసుకున్నప్పుడు, రక్తహీనతలోను, పెద్ద పొదుగు గల ఈనబోయే పశువులలోను ఈస్థితి కన్పిస్తుంది. ఏకారణం వలన నీరు చేరటం జరిగిందో దానిని నిర్ధారించుకొని తగిన

విధంగా వైద్యం చేయించాలి. చెడునీరు చేరి వాపు ఏర్పడి నపుడు ప్రాథమిక చికిత్సగా బియ్యపు పిండిని ఉడకబెట్టి నీరు పట్టిన ప్రదేశం మీద వేడిగా పట్టువేయటం వలన కొంత ఫలితం కనిపిస్తుంది.

# చర్మరోగాలు

చర్మానికి ఉన్న వెంట్రుకలు రాలిపోయి మరల క్రొత్త వెంట్రుకలు ఏర్పడటం పశువులలో సహజం, ఇలా కాకుండా వెంట్రుకలు రాలిపోయి తిరిగి పుట్టకుండా ఉండటం చర్మరోగాలలో తరచు కనిపిస్తుంది. దీనికి కారణాలు అనేకం. చర్మం దురదపుడితే ఆభాగాన్ని పశువులు ఏ చెట్టుకో కట్టికోరుద్దుకుంటాయి. విపరీతంగా నాకుతాయి లేదా కొరుకుతాయి. వీటివలన వెంట్రుకలు రాలిపోతాయి. చర్మాన్ని ఆశ్రయించిన పేలవంటి వాటి వలన, కొన్ని

జాడ్యాలలోను ఈస్థితి ఏర్పడుతుంది. ఆహారంలో అయొడిన్ లోపం గల తల్లులకు పుట్టిన దూడలలో కూడా ఇది కన్పిస్తుంది. విటమిన్ సి లోపం వలన కూడా దూడలలో క్రొత్త వెంట్రుకలు రావు.

పశువులలో చర్మం మీది వెంట్రుకలు రాలిపోయి తిరిగి రాకుండా ఉన్నప్పుడు దానికి కారణాన్ని తెలుసుకొని నివారణ చేపట్టాలి. చర్మం దురదపుట్టి నాకుతూ రుద్దుకొంటూ వుంటే 25మి. గ్రాములు "అవిల్" బిళ్ళలు పదింటిని రోజుకు ఒక పూట 3,4 రోజులు వాడవచ్చు. దిరిసెన. వేప ఆకుల్ని బియ్యం కడిగిన నీళ్ళతో దంచి పసరుతీసి శరీరానికి పూయవచ్చు.

పేలు పట్టినపుడు మందుల షాపులలో దొరికే "బ్లేజ్" అనే ద్రవాన్ని పూయటం వలన కాని, "అసున్‌తాల్-50" అనే మందు 15 గ్రాముల్ని ఒక లీటరు నీటిలో కలిపి రాయటం వలన కాని పేలను నివారించుకోవచ్చు.

గజ్జి : చర్మంపై భాగం కంది చిన్న చిన్న పొక్కులు లేచి ఛగిలి చెమ్మతోగాని రసితోగాని ఉండటాన్ని గజ్జి

అంటాము. ఇది ఏర్పడిన పశువు తరచు ఆ భాగాన్ని రుద్దుతూ ఉంటుంది. దురద, మంటలు, చర్మం పొలుసులు లేచిపోవటం దీని లక్షణాలు.

గజ్జిగల భాగాన్ని శుభ్రంగా కడిగి ఆరిన తరువాత మందుల షాపులలో దొరికే ఫ్లెమెటిక్ లేదా ఫ్యురాసిన్ వెట్ లేదా హైమాక్స్ ఆయింట్‌మెంట్లలో ఒక దానిని రోజుకు ఒకటి లేదా రెండు సార్లు పూయాలి. గంధక చూర్ణాన్ని కొబ్బరి నూనెలో కలిపి రాయవచ్చును.

చర్మం లోపలి భాగాన్ని కూడ ఆశ్రయించే గజ్జి (డెర్మటైటిస్) బాక్టీరియా, వైరస్, ఫంగస్‌ల వలన, పిడుజుల వలన, అపరిమితమైన శీతోష్ణాల వలన, రసాయనాల్ల వలన, శరీరతత్వానికి సరిపడని ఆహార పదార్థాల వలన, విటమినుల (ముఖ్యంగా బి విటమినుల) లోపం వలన ఏర్పడవచ్చు.

తొలి దశలో చర్మం ఎరుపెక్కి కంది, కొంచెం వేడిగా వుంటుంది. తరువాత ఆయా కారణాలనుబట్టి మార్పు చెందుతుంది. చీము, రసి కారటం, చర్మంక్రింద నీరు చేరటం జరుగుతుంది. చర్మం పొలుసులు లేస్తుంది. కొన్ని సందర్భాలలో దురద వుంటుంది.

చికిత్సలో ఆయా కారణాలను గమనించి వాటిని

తొలగించాలి. గురయిన చర్మ భాగాన్ని 0-1 శాతం పొటాషియం పర్మాంగనేటు లోషనుతో కడిగి సల్ఫానిలమైడ్ లేదా సిబాసల్ఫ పౌడరును గాని, హైమాక్స లొరాక్సిన్, సిబాసల్ఫ ఆయింట్‌మెంట్లలో ఒక దానిని గాని వాడాలి. చర్మం త్వరగా మామూలు స్థితికి చేరుకోవటానికి మంచి పోషకాహారాన్ని ఇవ్వాలి.

గాయాలు : నిత్యజీవితంలో పశువు శరీరానికి గాయాలవటం సహజమే. కారణాలు ఏమైనా, గాయమైన వెంటనే రక్తం కారటాన్ని నిలుపుచేయాలి. రక్తం కారే ప్రదేశాన్ని దూదితోగాని, శుభ్రమైన మెత్తని గుడ్డతోగాని గట్టిగాఒత్తి అదిమిపట్టి కారే రక్తాన్ని ఆపవచ్చు. రక్తం కారే భాగానికి పైభాగాన్ని గట్టిగా తాడుతోకట్టినా రక్తం కారటం ఆగుతుంది. గాయాన్ని శుభ్రమైన చల్లని నీళ్ళతో కడగాలి. సిబాసల్ఫ పౌడరును గాని, సిబాసల్ఫ హైమాక్స, లొరాక్సిన్ ఆయింట్‌మెంట్లలో ఒకదానిని గాని గాయంపై వేసి కట్టుకట్టాలి. ఇవేవీ దొరకనప్పుడు వెలిగారం, పటిక, మైలతుత్తం సమంగా నూరి ఆ పొడిని గాయంపై వేసి కట్టుకట్టాలి.

# కంటిజబ్బులు

కంటిజబ్బులలో సాధారణమైనది పుసికట్టటం కన్ను మొదట నీరు కారుతుంది. తరువాత పుసికడుతుంది. కను రెప్పలు రెండు పుసులతో అంటుకొనిపోయి పశువుకు కన్ను తెరవటం కష్టమౌతుంది. దీనికి కారణాలు అనేకం.

కొన్ని రకాల సూక్ష్మజీవులు (బాక్టీరియా) రెప్పల లోపలిపొరలలోనికి చొచ్చుకొని పోవటం. వైరస్ వ్యాధుల లోను, గాయమైనప్పుడు సూక్ష్మజీవులు కంటిలో ప్రవేశిం చటం, సున్నం వంటి కారుగల పదార్థాలు, డిటర్జంటు పౌడర్లు ద్రవాలు, ద్రావకాలు, కొన్ని రసాయనిక పదార్థాల వలన వచ్చే వాయువులు, పొగ, పురుగుల మందులు మొ॥వి కళ్ళలోపడటం. ఇసుక, మట్టి, దుమ్ము ధూళి, పొట్టు, పుప్పొడి వంటివి కళ్ళలో పడటం- మొదలైనవి.

పుసి కట్టిన కంటిని శుభ్రమైన చల్లని నీళ్ళతో కడ గాలి. తడి ఆరిన తరువాత టెర్రామైసిన్ కంటి ఆయింట్ మెంటును గాని, సోఫ్రామైసిన్ కంటి చుక్కలను గాని కంటిలో వేయాలి. పశువును ఎండలో కట్టివేయ కూడదు.

కంటిపొర : విటమిన్ ఎ లోపంవలన కంటిలో పొరఏర్పడటం,

చూపు మందగించటం జరుగుతుంది. కుందేటి వెర్రి రోగంలో కళ్ళుపొరలు కమ్ముతాయి. కంటిలో పుల్లలు గుచ్చుకోవటం, కంటికి చెర్నాకోలు దెబ్బలు వంటివి తగలటం వలన కూడా కంటిపొరలు ఏర్పడుతాయి.

పసిదూడలకు జున్నుపాలను తగినంతగా తాగించటం వలన, పెద్ద పశువులకు పచ్చిగడ్డిని సమృద్ధిగా మేపటం వలన విటమిన్ ఎ లోపాన్ని రాకుండా చూచుకోవచ్చు. పచ్చిగడ్డి మేపని పశువులకు రోజూ రెండు ఔన్సులు కాడ్ లివర్ ఆయిల్‌గాని, షార్క్-లివర్ ఆయిల్‌గాని తాగించాలి. కుందేటి వెర్రికి చికిత్స చేయించగానే ఆ వ్యాధి వలన ఏర్పడిన కంటిపొర పోతుంది. దెబ్బల వలన ఏర్పడిన కంటిపొర పోతుంది. దెబ్బల వలన ఏర్పడిన కంటిపొరలకు, పూవులకు అనుభవంగల పశువైద్యుని చేతనే చికిత్స చేయించుకోవాలి.

## అంటువ్యాధులు

పశువులు అనేకమైన అంటువ్యాధులకు గురి అవుతుంటాయి. బాక్టీరియా, వైరస్‌ల వలన ఇవి ప్రధానంగా

ఏర్పడుతాయి. పశువు అంటు రోగానికి గురిఅయిన తరువాత చికిత్స చేయించుకొనే కంటే రాకముందే వ్యాధినిరోధక టీకాలను వేయించటం ఉత్తమము. ఆ అవకాశం, సౌకర్యం, శ్రద్ధ లేనందువలన కలిగే అంటువ్యాధులను వెంటనే గుర్తించి సత్వర చికిత్స చేయించకపోతే పశువుకు ప్రాణాపాయం కలుగుతుంది.

ఇప్పుడు ముఖ్యమైన అంటు రోగాలను గూర్చి క్లుప్తంగా తెలుసుకొందాం.

గొంతువాపు : దీనిని గుదిపెట్టు, గురక, కుతికవాపు, గొదవాపు, గొంతుమాద, కంఠమాద అని కూడా అంటారు.

ఇది తరచుగా గెదెజాతి పశువులలో అందునా ప్రధానంగా ఆరు నెలల నుండి 4 సం॥ల లోపు వయసుగల పశువులలో కన్పిస్తుంది. వర్షానికి ఘొలిచిన లేత పచ్చికనాశ్రయించిన సూక్ష్మజీవులు ఆ పచ్చికను మేసిన పశువు శరీరం లోనికి ప్రవేశించటం ద్వారాను, పశువుల గొంతులోనే

ఉండే ఈ వ్యాధికారక సూక్ష్మజీవులు, పశువు ఆహారలోపం వలన గాని, వాతావరణ ప్రభావం వలనగాని నీరసించి నప్పుడు విజృంభించి యీ రోగాన్ని కలిగిస్తాయి.

పశువుకు తీవ్రమైన జర్వం తగులుతుంది. ఆహారాన్ని ముట్టదు. నిస్తేజంగా ఉంటుంది. నోటివెంట చొంగ పడుతుంది. గొంతుక్రిందకు నీరుదిగి గొంతువాపు వస్తుంది. తల కూడా వాస్తుంది. క్రమంగా గురక ఏర్పడుతుంది. చికిత్స లేకుంటే పశువు సాధారణంగా 24 గంటలలోపే మరణిస్తుంది. "రోగాల్లో గురక" అనే సామెత ఈ వ్యాధి ప్రమాదకరమైనదని చెప్పేదానికి పుట్టింది. కొన్ని పశువులు ఒకటి రెండు రోజులు బ్రతుకుతాయి. వాటిలో రక్త విరేచనాలు, శ్వాస ఆడక ఇబ్బంది పడటం, కళ్ళువాయటం, నాలుక మొద్దుబారటం వంటి లక్షణాలు కూడా కన్పిస్తాయి.

రోగాన్ని ఎంత త్వరగా గుర్తించి చికిత్స ప్రారంభిస్తే అంత ఫలితం కన్పిస్తుంది, యాంట్రిమా, సల్ఫా

ట్రిమ్, రొబట్రాన్, టెట్రామైసిన్, సల్ఫాడిమిడిన్ వంటి బిళ్ళలను ఏదైనా ఒకదానిని పూటకు 4 నుండి 8 చొప్పున వాడాలి. బిళ్ళలతో పాటు బయోట్రిమ్, బయో సల్ఫ వంటి ఇంజక్షన్లు చేయించటం మంచిది. 4 తులాల ముద్ద కర్పూరాన్ని బెల్లంతో నూరి ప్రాథమిక దశలో పెట్టటం వలన కొంత సుగుణం కన్పిస్తుంది.

జబ్బవాపు : దీనిని సప్పవాపు, జబ్బకుంటు, దూలవాపు, కుందు, చెప్పరోగము అని కొన్నిచోట్ల కురమ అని పిలుస్తారు. 6 నెలలు - నాలుగు సంవత్సరాల మధ్య వయసుగల ఆవుజాతి పశువులు - తిండి పుష్టి బాగా ఉన్నవి - ముఖ్యంగా ఈ జబ్బుకు గురి అవుతాయి. ఈ వ్యాధిని కలిగించే సూక్ష్మజీవులు నేలలో చిరకాలం నివశిస్తాయి. నేలన గల ఆహారాన్ని గ్రహించటం ద్వారా పశువుకు వ్యాధి సంక్రమిస్తుంది.

తీవ్రమైన జ్వరం, నీరసం పశువును ఆవరిస్తాయి. పశువుకు గల నాలుగు కాళ్ళలో ఏదో ఒక కాలు ఈ వ్యాధికి గురవుతుంది. దానితో పశువు కుంటుతుంది. జబ్బ భాగాన

గాని, తుంటి భాగాన కాని వాపు ఏర్పడుతుంది. వాచిన ప్రదేశం ముందు వేడిగా ఉండి క్రమంగా చల్లబడుతుంది. అప్పుడు అంతగా నొప్పి ఉండదు. గాలి చేరి నొక్కినప్పుడు బుర బుర లాడుతుంటుంది. ఊపిరి పీల్చటం వదలటంలలో పశువు ఎంతో కష్టపడుతుంది. ముక్కుల వెంటడి నురగతో కూడిన ద్రవం కారుతుంది.

పెన్సిలిన్, టెట్రాసైక్లిన్ మందులు గుణాన్నిస్తాయి. 40 లక్షల పెన్సిలిన్ ఇంజక్షనును 6 గంటలకు ఒకసారి చేయించటం వలన మంచిఫలితం ఉంటుంది. వ్యాధిని తొలిదశలో గుర్తించినపుడు పై చికిత్స అందు బాటులో లేనపుడు నేలవేము రసం అరసోలెడు (125మి.లీ) లో రెండుతులాల మిరియాలు నూరి కలిపి త్రాగించవచ్చు. వ్యాధి తీవ్రమైనప్పటికీ చికిత్స చేయించలేనిస్థితిలో రూపాయి బిళ్ళంత ఇనుపబిళ్ళను బాగా కాల్చి వ్యాధిసోకిన ప్రదేశంపై చాల చోట్ల వాతలు వేయటం వలన పశువుకు మరణ ప్రమాదాన్ని తప్పించవచ్చు. అయితే ఇలా వాతలవేసే పద్ధతిని ఆ ప్రక్రియలో సిద్ధహస్తులైన వారి వద్ద నేర్చుకొని చేయటం మంచిది,

దొమ్మ : దీనిని నెత్తురు రోగము అనికూడ అంటుంటారు. ఈ వ్యాధి సోకిన పశువు ఎటువంటి రోగలక్షణములను చూపించకుండానే అకస్మాత్తుగా చనిపోవటంగాని స్వల్ప కాలం మాత్రమే అస్వస్థతతోఉండి చని పోవటంగాని జరుగుతుంది. చనిపోయిన పశువు శరీర రంధ్రాలనుండి (ముక్కు, ముడ్డి, నోరు, చెవి మొ॥) నెత్తురు కారటం ఈ వ్యాధి ప్రత్యేకత, కొందరు దీనిని వ్యాధిగా గుర్తించక దిష్టి తగిలి చనిపోయిందనో, గాలిసోకి పోయిందనో భావించటం జరుగుతుంది.

ఈ వ్యాధిని కలిగించే సూక్ష్మజీవులు వాతావరణ వైరుధ్యాలను తట్టుకొని నేలలో చాలకాలం (12 సం॥లవరకు కూడ) జీవించగలవు. అనుకూల పరిస్థితులలో ఇవి ఆహారం ద్వారాగాని నీటిద్వారాగాని పశువు శరీరంలో ప్రవేశించి రోగాన్ని కలిగిస్తాయి. వ్యాధి తీవ్రంగా వస్తే పశువు వెంటనే మరణిస్తుంది. వ్యాధి తీవ్రత అంతగా లేకుండా ఉంటే పశువు 2, 3 రోజులు జీవిస్తుంది. ఈస్థితిలో పశువు శరీర ఉష్ణోగ్రత బాగా పెరుగుతుంది. నొప్పితో బాధపడుతుంది. కళ్ళవెంబడి నీరు, పేడ మూత్రము వెంబడి రక్తము వస్తాయి. ఊపిరి అందటం కష్టమౌతుంది.

వ్యాధి తీవ్రంగా లేనప్పుడు మాత్రమే చికిత్సకు అవకాశం ఉంటుంది. సల్ఫాడిమిడిన్, యాంట్రిమా, బిళ్ళ లను పూటకు 4 నుండి 8 గాని, బయోట్రిమ్ ఇంజక్షనుగాని ఇచ్చినట్లయితే కొంత ఫలితం కన్పిస్తుంది.

ఈ రోగం తగిలి చనిపోయిన పశువును పూడ్చి వేయటం మంచిది. లేదా కాల్చివేయవచ్చు. చర్మాన్ని ఒలి పించటం, రక్తాన్ని, శరీరంలోని ద్రవాలను నేలమీద కారే టట్లు చేయటం వలన రోగం మరింత ప్రబలమయ్యే ప్రమాద ముంది.

గాలికుంటు :

దీనిని గాళ్ళు, కాలినోటి గాళ్ళు. కుందు, గొరసగాలు, జడుపు, సంచ అనికూడ అంటారు. ఇది వైరస్ వలన కలిగే వ్యాధి. వ్యాధి వ్యాప్తివేగంగా జరుగుతుంది. ప్రస్తు తం ఇది ఒకకాలానికి పరిమితం కాకుండా అన్ని కాలాల లోను కన్పిస్తున్నది.

జ్వరంతో పశువు నిరుత్సాహంగా ఉండటం మొదటి దశ. ఈ జ్వరము 2.3 రోజులను మించి ఉండదు. నోటి

లోను, గిట్టల మధ్య, కాలిగిట్టలమధ్య బొబ్బలు లేచి చితికి పుండ్లు అవుతాయి. కాలిపుండ్లలో పురుగులు పడి గిట్టలు ఊడిపోవటం కూడా తరచుగా జరుగుతుంది.

పాడి పశువులలో పాల ఉత్పత్తి 50 నుండి 75 శాతం వరకు తగ్గుతుంది. వ్యాధి తగిలిన తల్లిపాలు తాగితే లేగదూడలు చనిపోతాయి. కాబట్టి పసిదూడలను వ్యాధి తగిలిన తల్లి దగ్గర పాలు తాగనీయకూడదు. చూడి పశువులు ఈసుకు పోతాయి. పంట పశువులు పనిచేయలేవు. ప్రాణ నష్టం తక్కువే కాని ఉత్పత్తి తగ్గటంతో పశుకామందుకు ఆర్థికనష్టం ఎక్కువ.

తొలిదశలో యాంటి బయాటిక్ మందుల వాడకం వలన వ్యాధి తీవ్రత కొంత తగ్గే అవకాశం ఉంది. నోటి పుండ్లకు బోరిక్ పొడిని గ్లిసరిన్‌లో కలిపి పూయవచ్చు. కాలిపుండ్లకు వేపనూనెలో జింక్ ఆక్సైడ్ పొడిని కలిపి పూయవచ్చు. పశువుకు విశ్రాంతి అవసరము. మెత్తని, సులభంగా జీర్ణమయ్యే ఆహారాన్ని ఇవ్వాలి.

ముసర :

దీనిని పశువుల ప్లేగు, పెద్దరోగం, చీడపారుడు, పిల్లిసరుకు, తొక్కుడి, పెద్దచీడ, నాసరచీడ, దూసడ, పెద్ద

సరకు రక్తకాసె, కటికరోగం వంటిపేర్లతో కూడా పిలుస్తారు. ఇది ప్రమాదకరమైన అంటువ్యాధి. ఇది సోకిన పశువులు మందలు మందలుగా మరణిస్తాయి. వ్యాధి సోకిన వారం రోజులకు గాని లక్షణాలు కన్పించవు.

104, 105 డిగ్రీల జ్వరంతోపాటు కళ్ళు నీరు గారటం, ముట్టె ఎండిపోవటం, మలబద్ధకం, రోమం నిక్కబొడుచుకోవటం, వెన్ను విరుచుకోవటం తొలి లక్షణాలు. క్రమంగా పారుడు ప్రారంభమై జ్వరం తగ్గుతుంది. ఈ పారుడు అతితీవ్రంగా ఉండి పశువును పీల్చి పిప్పిచేస్తుంది. పారుడులో రక్తం బంక కూడా కన్పిస్తాయి. రోగం గల పశువు చొంగ, మూత్రం, పేడ, కన్నీళ్ళ, పడిశం గుండా వ్యాధిని కలిగించే వైరస్ క్రిములు విడుదలై వ్యాధిని వ్యాపింపజేస్తాయి.

దీనికి నమ్మకమైన చికిత్సలేదు. రోగ లక్షణాలను బట్టి మందులు వాడుకోవాలి. గ్లూకోజ్ ఇంజక్షన్లు, యాంటిబయాటిక్ మందులు వాడాలి. వీటికి తోడు తగిన ఆహారాన్ని ఇవ్వాలి. రాగి లేదా జొన్నపిండిని జావగా కాచి అందులో 15 గ్రాములు శొంఠిపొడిని, గ్లూకోన్‌ను కలిపి నాలుగుగంటల కొకసారి ఇవ్వాలి. వ్యాధి తగిలిన పశువును

ఇతర పశువుల నుండి వేరుచేయాలి. వ్యాధి తగిలిన పశువు ఉన్న ప్రదేశాన్ని ఎప్పటికప్పుడు శుభ్రంచేసి అక్కడి చెత్త చెదారాన్ని తగలబెట్టాలి. ఫినాయిల్ చల్లటం మంచిది.

పైనచెప్పిన అంటు వ్యాధులను పశువులకు రాకుండా నివారించుకొనేదానికి ఇప్పుడు టీకామందులు దొరుకుతున్నాయి. కాబట్టి పశుకామందులు సమీపంలోగల పశువైద్యులను సంప్రదించి తగిన సమయంలో పసువులకు టీకామందులు వేయించుకోవాలి.

ఈ విధంగా తాము పోషించే పశువులను రోగాల బారినుండి కాపాడుకొంటే పశుకామందులు తమ సంపదతో పాటు దేశసంపదనుకూడా వృద్ధిచేసిన వారవుతారు.

(సమాప్తం)

చి ర నా మా
డా. సూర్యదేవర రవికుమార్
బి.వి.యస్సి
పశువైద్యశాల
భట్టిప్రోలు
522 256
గుంటూరుజిల్లా



...o...

# మా నూతన ప్రచురణలు

- ★ పశురోగాలు-నివారణలు
- ★ శాంతి పావురాలు
- ★ దేశరక్షణ
- ★ ఇల్లు-పరిసరాలు-ఆరోగ్యం
- ★ గ్రామసీమలు
- ★ పక్షివిలాపము